# ఆంధ్రపత్రిక

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 35 No. 232 THURSDAY 25th NOVEMBER 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao




# సూచౌ యుద్ధంలో చైనాప్రభుత్వ సేనల ఆందోళన స్థితి

## కమ్యూనిస్టుచక్రబంధమున చిక్కుబడిన దళములు దాసోహమనక తప్పదట

నాన్‌కింగు, నవంబరు 23: సూచౌకు తూర్పుగా జాంచువాన్ వద్ద కమ్యూనిస్టులచే చుట్టుముట్టివేయబడిన ప్రభుత్వసేనల పరిస్థితి అలాగే ప్రతిష్టంభనలో ఉన్నదనీ, త్వరలో వారికి ముక్తిలభించే సూచనలు లేవనీ, వారికి సహాయంగావెళ్లే చాల ప్రతిఘటన నెదుర్కోవలసి వచ్చుచున్నదనీ తెలియుచున్నది. చుట్టుముట్టబడిన సేనలు దాసోహమనక దప్పదని నాన్కింగు పరిశీలకు లనుచున్నారు.

సూచౌకు తూర్పున 20 మైళ్ల దూరంలో తీవ్రయుద్ధం జరుగుతున్నట్లు, ప్రభుత్వసేనలు కమ్యూనిస్టు చక్రబంధం నుండి తప్పించుకొనుటకు అంగుళా లెక్క పెట్టుకుంటూ ముందుకు సాగుతున్నవని చైనీస్ రక్షణశాఖ పదేపదే ప్రకటించుచున్నది. ఈరంగంలో రెండు కమ్యూనిస్టు దళములను తాము తుడిచివేసితిమనీ, చాల గ్రామములను పట్టుకొంటిమనీ, సూచౌకు దక్షిణంగా అన్‌హ్వీరాష్ట్రంలో ప్రభుత్వసేనలు బాగా పురోగమించుచున్నవనీ కూడా ప్రకటింపబడినది.

సూచౌకు దక్షిణంగా ఉన్న రైల్వే పట్టణం సుషీన్‌ను కమ్యూనిస్టులనుండి విడిపించుటకు రెండు ప్రభుత్వ పటాలములు దక్షిణంనుండి, ఆగ్నేయంనుండి ద్విముఖ పురోగమనం సాగిస్తున్నవట. సూచౌకు వాయవ్యంగా ప్రభుత్వ విమానాలు నిరంతరంగా కురిపించే బాంబుల వలన కమ్యూనిస్టులు చెల్లాచెదరై పోతున్నారనీ, కూడా రక్షణశాఖ ప్రకటిస్తున్నది.

అయితే ఫలానా విజయాలు సాధించితిమని ప్రభుత్వం ప్రకటించక ఊరుకోవడంవల్లా, ఆ చేసే ప్రకటనలలో కూడా సందిగ్ధంగా, పరస్పర విరుద్ధంగా విషయాలు చెప్పడం వల్లా, సూచౌ యుద్ధం ప్రభుత్వమున కాందోళన కలిగిస్తున్నదనే పరిశీలకు లూహించుచున్నారు. ఉత్తర చైనాలో యుద్ధం మందకొడిగా ఉన్నా, ఉభయపక్షాలు సేనలను విశేషంగా కేంద్రీ

4 వ పేజీ చూడుడు

## జపాను యుద్ధాపరాధుల శిక్షల ఖాయం

### జనరలు మెక్ ఆర్థర్ ఉత్తరువు

లండను, నవంబరు 24: జపాను దేశమును యుద్ధములోనికి దింపిన జపాను ప్రముఖనాయకులను నేరస్థులుగా నిందించి ఇటీవల నేర విచారణ జరిపి, శిక్షలు విధించడమైనది. ఈ శిక్షల నన్నింటికి యథావిధిగా ఆమోదించి ఖాయపరచడమైనదని జపానులో సర్వాధికారము వహించిన అమెరికను సేనాధిపతి జనరలు మాక్ ఆర్థరు నేడు ప్రకటించెను. ఆ శిక్షలను యథావిధిగా అమలు జరుపవలెనని అచటి అమెరికన్ ఎనిమిదవ సేన తాలూకు సైన్యాధికారికి ఉత్తరువు జారీచేసెను.

# 'విభక్తపాలస్తీనాసరిహద్దులపైయూదు అరబ్ సంప్రతింపులు అవసరం'

## సమితిరాజకీయసంఘంలో అమెరికాప్రతిపాదన

పారిస్, నవంబరు 23: "పాలస్తీనా విభజన సరిహద్దులవిషయమై అరబ్బులకు యూదులకు తీవ్రవిభేదాలున్నమాట నిజమే కాని, వాటిని సామ్యమార్గాన పరిష్కరించి సమాధానపరచటం చాల అవసరం. కాబట్టి సమితి నెలకొల్పదలచుకొన్న సమాధానసంఘానికి సంప్రదింపులు నడపటానికి చాలినంతస్వేచ్ఛను ఇవ్వవలసి ఉంటుంది," అని అమెరికా ప్రతినిధి డా॥ ఫిలిప్ జెస్సప్ నేడు ఐక్యరాజ్యసమితి రాజకీయసంఘంలో సూచించెను.

పాలస్తీనాలోని అరబ్ ప్రాంతాలను పక్కనేవున్న అరబ్ రాజ్యాలలో కలిపివేయవలెననీ, జెరూసలేం పరిసరప్రాంతాలను సమితి పరిపాలనక్రింద ఉంచవలెననీ, ఆ ప్రాంతంలోని యూదు, అరబ్ వర్గాలకు సంపూర్ణ స్థానికస్వపరిపాలనము నివ్వవలెననీ, బ్రిటన్ చేసిన ప్రతిపాదనలను అమెరికా సమర్థిస్తున్నదని డా॥ జెస్సప్ ప్రకటించెను.

విదేశాంగమంత్రి "సమితి విభజన పథకంలో సూచింపబడిన ప్రాంతమంతా కానీ, లేక యూదులు ప్రస్తుతం ఆక్రమించుకున్న ప్రాంతమంతా కానీ వారికి పోవటం జరగకూడదని ఉద్ఘాటించెను. అరబ్బులు అంతాకలిసి ఇజ్రాయెల్‌ను నాశనము చేయటంకూడా సహించరానిదని కూడా అతడు అన్నాడు.

### అరబ్బు కాందిశీకులు

లండన్, నవంబర్ 23: పాలస్తీనాలోని అరబ్ కాందిశీకులను రక్షించటానికై ప్రపంచ దేశాలన్నీ కలిసి విమానాలలో వారికి సాయం పంపవలెనని మధ్యప్రాచ్య వ్యవహారాల్లో బ్రిటిష్ ప్రభుత్వ సలహాదారుగా కెయిరోలోవున్న బ్రిగేడీర్ క్లేటన్ నేడొక విజ్ఞప్తిని చేసెను. గాలిలీ, నెగెవ్‌లమీదికి యూదులు తోసుకుపోయినదానికి ఫలితంగా 6 లక్షలమంది అరబ్బులు (మొత్తం అరబ్ జనసంఖ్యలో సగం) దిక్కులేకపోయిరని క్లేటన్ తన విజ్ఞప్తిలో తెలియజేసెను.

### విభజనకు 1947 తీర్మానమే ప్రాతిపదిక

పాలస్తీనాను విభజించవలెనని 1947లో ఐక్యరాజ్యసమితి చేసినతీర్మానంలో సూచింపబడిన ఏర్పాట్లనుమాత్రమే ఆధారముగా తీసుకొని ఆ సమస్యను పరిష్కరించవలెనని వాదిస్తున్న అమెరికా, రష్యాలతో నేడు ఆస్ట్రేలియా ఏకీభవించినది. ఈమూడు దేశాల దృక్పథం, బెర్నాడోట్ పథకము ననుసరించి బ్రిటన్ చేసిన ప్రతిపాదనలకు భిన్నంగా ఉన్నది. 1947 సం॥పు సమితి తీర్మానానికి అనుగుణంగా ఉభయపక్షాలు సరిహద్దులు నిర్ణయించుకొనుటకు వీలగు సామ్యపరిస్థితులను కలిగించుటకై 5 గురు సభ్యులతో ఒక సమాధానసంఘాన్ని ఏర్పరచవలెనని ఆస్ట్రేలియా తీర్మానం సూచించినది.

ఆస్ట్రేలియా తీర్మానం బ్రిటిష్ ప్రతిపాదనలతో ఈక్రింది విషయాలలో భేదిస్తున్నది.

(1) బెర్నాడోట్ పథకానికి అనుగుణంగా సరిహద్దులను ఆమోదింప జేయుటకై ముగ్గురు సభ్యులతో ఒకసమాధానసంఘాన్ని నియమించవలెనని బ్రిటన్ సూచించగా ఆస్ట్రేలియా 5 గురు సభ్యులను నియమించమని చెప్పి, బెర్నాడోట్ పథకం మాట ఎత్తలేదు.

(2) పాలస్తీనాలోని అరబ్ ప్రాంతాలను పక్కనేవున్న అరబ్ రాజ్యాలతో కలిపివేయవలెనని బ్రిటన్ ప్రతిపాదించగా, ఆప్రాంతప్రజల అభీష్టాన్ననుసరించి వాటి భవిష్యత్తును నిర్ణయించవలెనని ఆస్ట్రేలియా ప్రతిపాదించినది.

(3) ఇజ్రాయెల్ ఐక్యరాజ్య సమితి సభ్యత్వానికి దరఖాస్తు పెట్టుకుంటే ఆదరఖాస్తును ఉదారబుద్ధితో ఆలోచించవలెనని ఆస్ట్రేలియా భద్రతామండలికి సూచించినది.

నిన్న రాజకీయసంఘంలో జరిగినచర్చలో రష్యా, కెనడాలు విరుద్ధాభిప్రాయములను ప్రకటించినవి. రష్యా బెర్నాడోట్ పథకమును తోసివేయగా కెనడా

# సమితిలో ఐర్, సింహళముల సభ్యత్వమును నిరాకరించరాదు

## రాజకీయసంఘములో భారతప్రతినిధి వాదన

పారిస్, నవంబరు 23: ఐక్యరాజ్యసమితి సభ్యత్వమునకు సింహళమును, ఐర్‌నూ అనుమతింపవలెనని ఇండియా ప్రతినిధి ఎమ్. సి. సెటల్వాడ్ నేడు రాజకీయ అల్ప సంఘంలో వాదించెను.

ఐర్‌నుగాని, సింహళమును గాని నిరాకరించుటకు సరియైన కారణములు లేవని సెటల్వాడ్ అన్నాడు.

సమితి తన కర్తవ్యమును పూర్తిగా నిర్వహించవలెనంటే ప్రణాళిక నిబంధనలను అంగీకరించిన రాజ్యముల కన్నిటికీ సభ్యత్వము నీయవలెననీ, అట్టివారి సభ్యత్వమును తాము సమర్థించెదమనీ పాకిస్థాన్ ప్రతినిధి అన్నాడు.

సింహళపు దరఖాస్తును రష్యా వీటో చేసినది. ఈ వీటో ప్రయోగమును నిరసించుచు "సింహళము సర్వ స్వతంత్ర రాజ్యమనీ, శాంతి కాముక దేశమనీ, సింహళమును చేర్చుకొనుట కేనిబంధనలు అడ్డురావనీ" న్యూజీలెండు ప్రతినిధి గూడ చాల తీవ్రముగా వాదించెను.

### ఫ్రెంచి సమ్మెదారులకు రష్యను కార్మికులసహకారం

లండను, నవంబరు 22: రష్యను గనిపనివారు సమ్మె చేయుచున్న ఫ్రెంచి బొగ్గుపనివారికి అయిదున్నర కోట్లు ఫ్రాంకులు సహాయము పంపిరని నేటి రాత్రి మాస్కో రేడియో చెప్పెను.

### బెర్లిన్ సమస్య: భద్రతామండలికి ప॥ రాజ్యాల జవాబు

ప్యారిసు, నవంబరు 23: బర్లినునగరములో అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యాలకు చెందిన నాలుగు పేటలలో ఏ ప్రభుత్వానికిచెందిన ద్రవ్య చలామణీ యుండవలెనను విషయమై రష్యా తగాదా చేయుచున్నది. అమెరికా ఇంగ్లండు ఫ్రాన్సు అను మూడు పశ్చిమరాజ్యాల తాలూకు బర్లినునగరభాగములందు అమలుపరచబడిన ద్రవ్య చలామణీవల్ల రష్యను ఆక్రమిత ప్రాంతానికి అనర్థదాయకముగా నున్నదని రష్యా అధిక్షేపించుచున్నది. ఈ తగాదా పరిష్కారమునుగూర్చి భద్రతామండలికి పశ్చిమరాజ్యాలవారు ఫిర్యాదు చేయగా భద్రతామండలి కొన్ని ప్రశ్నలకు వివరీతముగా సమాధానముల నీయవలసినదిగా కోరెను. పశ్చిమరాజ్యాలవారు బర్లిను ద్రవ్య చలామణీవిషయమై తమ సమాధానములను వ్రాసి భద్రతామండలి అధ్యక్షునకు అందజేసెను. బర్లిను తగాదాకు సంబంధించిన నాలుగు రాజ్యాల సభ్యులుగాక, భద్రతామండలిలోని మిగతా సభ్యులు సమావేశము కావలెనని డా॥ బ్రాముగ్లియా కోరెను.

రాయల్ ఇండియన్ విమాన దళములలో ఇటీవల చేరిన జెట్ ప్రొపెల్డ్ వేంపైర్ విమానములో ప్రధాని నెహ్రూ, రక్షణ మంత్రి బలదేవ్ సింగ్ గారలు ఎక్కి తనిఖీ చేయుచున్న దృశ్యము.

# హైద్రాబాదుసమస్యపై మండలికి పాకిస్థాన్ ప్రతినిధి లేఖ

## గురువారంనాడు తిరిగి చర్చజరిగే సూచన

ప్యారిసు, నవంబరు 23: పాకిస్తాను విదేశాంగమంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖానుగారు హైదరాబాదు సమస్యను గూర్చి హెచ్చరిస్తూ భద్రతామండలి అధ్యక్షునకొక లేఖ యీక్రిందిరీతిగా వ్రాసిరి.

హైదరాబాదుసమస్యను చాలా జరూరుగా పరిశీలించవలసియున్నది. ఇదివరలో యీ విషయమై కొన్ని లేఖలు వ్రాసియుంటిమి. హైదరాబాదులోని వ్యవహార పరిస్థితులు అంతకంతకు అధ్వాన్నమగుచున్నవి. ఈ పరిస్థితులను చక్కజేయుటకు భద్రతామండలి జరూరుగా పూనుకొనవలసియున్నది.

### గురువారంనాడు ప్రారంభము కావచ్చు

పారిస్, నవంబరు 23: హైదరాబాదు ఫిర్యాదును పాకిస్థాన్ ప్రతినిధి సర్ జఫ్రుల్లాఖాన్ గత వారం భద్రతామండలికి తిరిగి ప్రతిపాదించెను. గనుక ఈ ఫిర్యాదు వచ్చే గురువారంనాడు చర్చకు రాగలదని తెలియుచున్నది.

హైదరాబాదు పరిస్థితి బొత్తిగా చెడిపోవుచున్నదనీ, తక్షణ చర్యలు గైకొనవలెనని సర్ జఫ్రుల్లాఖాన్ మండలి అధ్యక్షునికి వ్రాసెను.

గురువారమునాడు కాశ్మీర్ సమస్య గూడ మండలిలోచర్చింపబడును. కాశ్మీర్ సమస్యపైకూడా పాకిస్థాన్ యీ సారి ఎదురు ఫిర్యాదు చేసినది.

### 'కాశ్మీర' సమస్య

#### భద్రతామండలికి పాకిస్థాన్ ఫిర్యాదు

ప్యారిసు, నవంబరు 23: కాశ్మీరు తగాదాను పరిష్కరించుటకై ఐక్యరాజ్యసమితిచే నియమింపబడిన కమిటీ కాశ్మీరు పరిస్థితులను పరిశీలనచేసి వెళ్ళినప్పుడు యీ కమిటీ ఇక్కడ హాజరులేనికాలమందు కాశ్మీరులో సంఘర్షణ వీలైనంతవరకు తగ్గించవలెనని పాకిస్తానుప్రభుత్వమును ఇండియా ప్రభుత్వమును కమిటీ కోరెను. అందుకు ఉభయప్రభుత్వములు సమ్మతించి ఆ ప్రకారముగా ఒప్పందము చేసెను. కాని ఇండియా ప్రభుత్వము యీఒప్పందమును ఉల్లంఘించి ఇటీవల కాశ్మీరుకు మరికొన్ని కొత్తసేనలను పంపినదనియు అచటి యుద్ధమును త్వరలో ముగింపు చేయవలెననే స్థిరసంకల్పముతో నున్నదనియు పాకిస్తాను విదేశాంగమంత్రియు ఐక్యరాజ్యసమితిలో పాకిస్తాను ప్రతినిధియు సర్. జఫ్రుల్లాఖానుగారు భద్రతామండలి అధ్యక్షునకు ఫిర్యాదుచేయుచు ఒక లేఖ వ్రాసిరి.

### ఇండియా-హంగేరీ

బుడాపెస్ట్, నవంబరు 24: ఇండియా, హంగేరీలు పరస్పరం రాజకీయ సంబంధాలను నెలకొల్పుకొనుటకు అంగీకరించినవని నేడిచ్చట అధికారరీత్యా ప్రకటించబడెను.

# కాశ్మీర్ యుద్ధం: పూంచ్ ముట్టడి సమాప్తి

శ్రీనగరు, నవంబరు 23: పూంచ్‌వద్ద భారతసేన కొంత చిక్కువడి ముట్టడింపబడి యుండెను. చాలా దినములుగా ముట్టడిలోనున్న యీ సేన కిప్పుడు విమోచన కలిగినది. బయటి ప్రాంతమందున్న భారతీయ సేనలు పూంచ్‌లో నున్న భారత సేనలను కలిసికొనెను. శత్రు విముక్త ప్రాంతములను రాజౌరీ మున్నగు ప్రాంతాలలో లెఫ్టినెంటు జనరలు కరియప్పగారు పర్యటనముచేసిరి. అజాదు కాశ్మీరుసేన నబడు పటాలములు యీ ప్రాంతంలో చేసిన ఘోరకృత్యములను వందలకొలది మహమ్మదీయులు కరియప్పగారికి వివరించి చెప్పిరి.

# మహాసభ కార్యవర్గం

## డా॥ శ్యామప్రసాదు ముఖర్జీ గారి రాజీనామా

ఢిల్లీ, నవంబరు 23: డాక్టరు శ్యామప్రసాదు ముఖర్జీగారు అఖిల భారత హిందూమహాసభ వర్కింగుకమిటీలో తమ సభ్యత్వమునకు రాజీనామా నిచ్చిరి. అందుకు కారణములను వివరించుచు యీక్రిందిరీతిగా ఒకప్రకటన చేసిరి.

భారత జాతి మహోచ్ఛదశలోనికి రావలెనంటే,వివిధ మతసంఘముల పరస్పర విద్వేషము అనునది పూర్తిగా పోవలెను. అట్టి మత విభేదములను పురస్కరించుకొని రోషావేశములను వృద్ధిచేసికొనరాదు. ఈ సిద్ధాంతములను అంగీకరించి అనుసరింపవలసినదిగా నేను హిందూమహాసభను కోరితిని. కాని, హిందూమహాసభ తిరిగి రాజకీయరంగములో ఒక మత సంఘమునకు చెందిన రాజకీయపక్షముగా పనిచేయవలెనని ఇటీవల హిందూమహాసభ వర్కింగు కమిటీ తీర్మానము చేసెను. ఈ తీర్మానము నేను సూచించిన సిద్ధాంతములకు వ్యతిరేకముగా నున్నది. అందువల్ల మహాసభ వర్కింగుకమిటీ సభ్యత్వమునకు రాజీనామా నిచ్చితిని.

# మన పోలీసుదళశిబిరంపై నిజాం కమ్యూనిస్టుల ముట్టడి

## ఒకపోలీస్ మరణం, ఇద్దరికి తీవ్రగాయాలు

విజయవాడ, నవంబరు 24: నిజాం సంస్థాన కమ్యూనిస్టులు 200 మంది అత్యంత ఆధునాతన ఆయుధములతో మొన్న సోమవారం రాత్రి మునగాల పరగణాలోని రామచంద్ర పురం గ్రామమందున్న మన ప్రత్యేక సాయుధ పోలీసుదళ శిబిరమును ముట్టడించిరని, ఒక పోలీసును చంపిరని, ఇద్దరు పోలీసులు తీవ్రముగ గాయపడిరని వార్త వచ్చినది.

రామచంద్రపురం మునగాలకు 6 మైళ్ల దూరమున నిజాం సరిహద్దున ఉన్నది.

కృష్ణాజిల్లా పోలీసు సూపరింటెండెంటు అప్పల నరసయ్యనాయుడుగారు నూజివీడు మకాములోనుండి ఈవార్త తెలియుటతోడనే,విజయవాడ డి.వై.ఎస్.పి.పృథ్వీరాజ్ సింగుగారితో రామచంద్రపురం వెళ్లిరి.

### ఆఫ్ఘనిస్థానుకు అమానుల్లా పునరాగమనం

కాబూలు, నవంబరు 23: ఇదివరలో ఆఫ్ఘనిస్థాను ప్రభువుగా నుండిన అమానుల్లా గారిపై తిరుగుబాటు జరిగినందున వారు ఆఫ్ఘనిస్థాను విడిచి పారిపోయిరి. వీరు తిరిగి ఆఫ్ఘనిస్థానుకు మరలివచ్చి ఒక సాధారణ పౌరునివలెనే జీవిత కాలక్షేపము చేయగోరిరి. అందుకు అనుమతినీయవలసినదని ఇప్పుడున్న ఆఫ్ఘనుదేశ ప్రభువుకు మహజరు వ్రాసికొనిరి. అందుకు ప్రస్తుత ఆఫ్ఘను అమీరు సమ్మతించెనని తెలియుచున్నది. అమానుల్లాగారికి ఆఫ్ఘనిస్థాను పౌరహక్కులు పూర్తిగా కలుగజేయబడును.

కలకత్తా, నవంబర్ 22: నిన్నటిదినం, కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులు డా॥ ప్రఫుల్లచంద్రఘోష్ గారికినీ, పాకిస్థాన్ ప్రధాని లియాకతాలీగారికినీ, జస్సూరులో ఒక సమావేశ మేర్పాటు చేయబడినది.

# డా॥ పట్టాభి సేవాప్రశంస

## విజయవాడలో జన్మదినోత్సవ సభ

(స్వకీయ విలేఖరి)

విజయవాడ, నవంబరు 24: నూతన రాష్ట్రపతి డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారి 69-వ జన్మ దినోత్సవము నేడుదయ మిచ్చట ప్రభాత భేరితో ప్రారంభమైనది. నగరమంతయు తోరణాదులతో కళకళ లాడుచున్నది.

నగరమందలి 8 డివిజన్ల కాంగ్రెసు సంఘముల యాజమాన్యమున ఒక్కరీతిగా కార్యక్రమముతో ఉత్సవము జరుగుచున్నది. సాయంత్రము నగర కేంద్ర కాంగ్రెస్ సంఘం యాజమాన్యమున గాంధీజీ మునిసిపల్ హైస్కూలు ఆవరణలో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతను బ్రహ్మాండమైన బహిరంగ సభ జరిగెను.

మరుపిళ్ళచిట్టిగారు అధ్యక్షుడుగ, ఇవటూరి కోటేశ్వరరావుగారు కార్యదర్శిగ ఏర్పడిన పట్టాభి జన్మదినోత్సవ నిర్వహణ సంఘము, డాక్టరుగారి జన్మదినోత్సవమును నేటినుండి నాలుగు రోజులు జరుపుటకు కార్యక్రమము ఏర్పాటుచేసెను. నేటి కార్యక్రమమునకు అధ్యక్షత వహింపవలసిన శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు రాకపోవుట సంఘమువారికి, ప్రజలకుకూడా చాల ఆశాభంగము కలిగించెను.

నేడుదయము రామగోపాల్ సత్రములో పట్టాభి గ్రంథాలయ తృతీయ వార్షికోత్సవము జరిగెను. చిట్టి, కోటేశ్వర రావు, పోతిన గణపతిరావు ప్రాతృతుడు పాల్గొనిరి.

పట్టాభిగారి జన్మదినోత్సవములు జయప్రదముగ జరుగుగాక అని ఆశించుచు ఉత్సవ నిర్వహణ సంఘమువారికి పశ్చిమ బెంగాల్ గవర్నర్ కైలాసనాథ కట్జు, బొంబాయి గవర్నరు సర్ మహారాజ్ సింగ్, ప్రధాని బాలగంగాధర ఖేర్, చెన్న రాష్ట్ర శాసనసభ స్పీకరు జె. శివషణ్ముగం పిళ్ళె, మంత్రులు మాధవమీనన్, భక్తవత్సలం, సీతారామరెడ్డి, లంకా సుందరం అత్మకూరి గోవిందరాజాచారి ప్రభృతుల పలువురు సందేశములు పంపిరి.

# చైనా సమస్యపై బ్రిటన్ అమెరికాల మతభేదం

వాషింగుటన్, నవంబర్ 23: చైనా సమస్యపై బ్రిటన్ అమెరికాలకు, ప్రధానమయిన విభేదమేర్పడినది.

ప్రెసిడెంటు ట్రూమన్, విదేశాంగ కార్యదర్శి మార్షల్ ఇంకా యితర ప్రముఖ రాజకీయ సలహాదారులు చైనాలో అనుసరింపదగిన నూతన విధానమును గూర్చి ఒక చెంప ఆలోచించుచుండగా, అమెరికా బ్రిటిషు ప్రభుత్వములు రెండునూ చైనాలో జరుగుచున్న కమ్యూనిస్టు పురోగమనమును గూర్చి విభిన్నదృక్పథములను ప్రదర్శించుచున్నవని ఇచ్చటి రాజకీయవర్గములలో తెలియుచున్నది.

## గంటల పంచాంగం

సర్వధారి నం॥ కార్తీక బ॥ నవమి 1948 నం॥ నవంబరు 25 గురువారం సు॥ నవమి ప 11-37 పూర ప 9-44 వర్జ్యం సా 4-30 ల 6-0 వ.

బ॥ దశమి నవంబరు 26 శుక్రవారం శు॥ దశమి ప 9 27 ఉ ప 8-17 వర్జ్యం సా 4-9 ల 5-39 వ.

ఆంధ్రపత్రిక

సర్వధారి నం॥ కార్తీక బ॥ నవమి గురువారం

## కాశ్మీర్ కమీషను నివేదిక

ఐక్యరాజ్య సమితి కాశ్మీరు కమీషను భద్రతామండలికి తాత్కాలిక నివేదికను సమర్పించినది. వెనుక, తమకు పాకిస్థాను, భారత ప్రభుత్వములకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరముల ప్రకటించి వెల్లడిచేసిన విషయములను పునః ఏకరువు పెట్టి, ప్లెబిసైటును ఏర్పరచుటకు గల అవరోధములను మాత్రము వివరించినది. అంతే కాని, సమస్యా పరిష్కారమునకు ఎట్టి ప్రతిపాదనలను గానీ తన నిశ్చితాభిప్రాయమును గాని తెలియ చేయలేదు. ప్రస్తుతము సమర్పించినది తాత్కాలిక నివేదికమాత్రమే కాబట్టి, తరువాత అంత్య నివేదికను సమర్పించి దానిలో తన అభిప్రాయములను తెలుపదలుచుకున్నదేమో?

ఏప్రియల్ 21వ తేదీన భద్రతా మండలి తీర్మానము ననుసరించి, కమీషను కార్యక్రమమును ఉపక్రమించినది. కాశ్మీరులో పాకిస్థాన్ సైన్యములు పాల్గొనుచున్నవని భారత ప్రతినిధి తెలియజెప్పినప్పుడు పాకిస్థాను విదేశమంత్రి సర్ జఫ రుల్లాఖాన్ అది ఆధారము లేని నింద అనెను. కాని కమీషను, కరాచీయందు దిగిన వెంటనే అది నిజమని అంగీకరించెను. అందువల్ల "కమీషను భద్రతామండలి తీర్మానమును అమలుపరచుటకు భిన్న వైఖరిని అవలంబించవలసివచ్చెను." పాకిస్థాను సైన్యములు పాల్గొనుచున్నవని మాత్రమే కాదు కమీషన్‌వారికి తెలిసినది. "అజాద్ కాశ్మీరు ప్రభుత్వ పక్షమున పోరాడుచున్న సైన్యములన్నియూ, పాకిస్థాన్ అజ్ఞాయిషీ క్రిందనే ఉన్నవ"ని కూడ తెలియవచ్చినది. అజాద్ కాశ్మీర్ ఉద్యమము రాజకీయముగాను సైనికముగాను సుశిక్షితమైన సంస్థగా నుండి, పాకిస్థాను సహాయముతో కాశ్మీరు ప్రభుత్వమును కూలద్రోయ ప్రయత్నించుచున్నదనికూడ తెలిసెను. అజాద్ ప్రభుత్వమును వారి ఆక్రమణ క్రింద యున్న ప్రదేశమును, ప్రజా సంఖ్యను లెక్కించుటలో కమీషను వారి భావము గ్రాహ్యముగుట లేదు. ఆదినుండి నెహ్రూ అజాద్ కాశ్మీర్‌ను లెక్కలోనికి తీసికొనలేదు. సర్ జఫరుల్లాను సమితియందు మాట్లాడనిచ్చినది కాని, అజాద్ కాశ్మీర్ ప్రతినిధిని మాట్లాడనివ్వలేదు. భద్రతామండలి ఏప్రిల్ 21 తీర్మానమును అమలు జరుపుటకు పరిస్థితులు భిన్నముగ నున్నప్పటికీ, కమీషను తన ప్రయత్నమును మానక యుద్ధవిరామ ప్రతిపాదనను సూచించినది. వాటిని భారత ప్రభుత్వము అంగీకరించినది కానీ, పాకిస్థాను ప్రభుత్వము అంగీకరించ లేదు. తమ ప్రతిపాదనలకు అతిక్రమైన షరతులను పాకిస్థాన్ సూచించినట్లు కమీషన్ తెలిపినది.

ఇట్టి సందర్భములో కమీషన్ పాకిస్థాన్ ప్రభుత్వమును దురాక్రమణ దేశముగ ప్రకటించకపోవుట విచిత్రము. అంతేకాక అజాద్ కాశ్మీర్ ప్రభుత్వమునుగురించి చెప్పిన వివరములు, అసందర్భముగనో లేక, వేరు ఉద్దేశ్యముతో చెప్పినవనో అనుమానము నకు ఆస్కారమివ్వకమానవు. అజాద్ కాశ్మీరు ప్రభుత్వమును కూడ గుర్తించవలెనని వారి భావమేమో తెలియదు. వారి ఆధిపత్యము క్రింద నున్న ప్రదేశము, పాకిస్థాను క్రింద నున్నదని పరిగణించవలెనా, లేక అజాద్ ప్రభుత్వము క్రిందనున్నదని భావించవలసియున్నదా అనునదికూడ విస్పష్టము చేయలేదు. ఏ విషయము విస్పష్టము చేయక, ఏ విధమైన సూచనచేయక "ఉభయులకు అంగీకారయోగ్యమైన పరిష్కారమార్గమును" ఆలోచింపవలెనని కమీషను తన నివేదికలో తెలిపెను. ఉభయులను అనుకూలమైనవని భావించి తాము మధ్యవర్తిగా చేసిన యుద్ధవిరమణ ప్రతిపాదనలే అంగీకరింపబడనపుడు మరొక పరిష్కారమార్గము రాగలదని ఆశించుట ఆశ్చర్యము. పైగా, భారత ప్రభుత్వము తమ ప్రతిపాదనలను అంగీకరించగా, పాకిస్థాన్ వాటిని తిరస్కరించినప్పుడు ఆ దేశమును దురాక్రమణదారుగ ప్రకటించి యుండవలసినది. అలా కాక, ఉభయులను సరిసమానముగ పరిగణించుటలో గల భావము గోచరించుట లేదు.

కమీషను ఈ వైఖరిని ప్రకటించినప్పుడు పాకిస్థాను సమాధాన మార్గమును అవలంబించు ననునది సందేహము. పైగా భారత ప్రభుత్వము అదనపు సేనలను పంపి, కమీషను నివేదిక వచ్చునప్పటికి పోరాటమును ముగించదలచినదను ప్రచారము సాగించినది. తాము అదనపు సేనలను పంపి, పోరాటమును తీవ్రపరచుటకు ఈ ప్రచారము సాకుతప్ప వేరు కాదు. యుద్ధ విరమణకు భారతదేశము అంగీకరించినది కాని, తాము అంగీకరించ లేదు. దానివల్లనే వారి ఆంతర్యము వెల్లడి అయినది. కాశ్మీరును దురాక్రమణనుండి రక్షించుటకు భారతదేశము కంకణముకట్టుకొనినది. అందువల్ల తన సైన్యములను పంపుటకు సంకోచించవలసిన పని లేదు. నూరేండ్లు పోరాడినా కాశ్మీరులో అంగుళము భూమిని వదలుటనునది లేదని భారత ప్రధాని ఇదివరకే తేటతెల్లము చేసెను. భారతసైన్యములు పాకిస్థాను సైన్యములకన్న ఎక్కువ ఆటంకముల నెదుర్కొనవలసి యున్నమాట నిజము. పాకిస్థాను సైనికులకు కొద్దిమైళ్ల దూరములో వారి సైనిక స్థావరములున్నవి. భారతసైనికులకు వందల మైళ్ల నుండి సరఫరాలు రావలసియున్నది. అయినప్పటికీ భారత సేనలు అమోఘకార్యములను సాధించినవని చెప్పవలసియున్నది.

## ఇండియా - పాకిస్తాన్ పరస్పర వ్యవహారాలు

ఢిల్లీ, నవంబరు 2[illegible]: ఇండియా ప్రభుత్వ కార్యదర్శులను పాకిస్థాన్ ప్రభుత్వ కార్యదర్శులను ఢిల్లీలో నాలుగునాళ్లు సమావేశమై [illegible] సమస్యలను పరిష్కరించిరి. నేటి కూడా సమావేశమై [illegible] లను పరిష్కరించిరి. కార్యక్రమం లోని మిగిలిన అంశములు రేపు ఆలోచింపబడును. రేపు సమావేశము పూర్తి యగును.

## జార్జిరాజు అస్వస్థత

### బ్రిటిష్ పార్లమెంటు సానుభూతి ప్రకటన

లండన్, నవంబర్ 23: జార్జిరాజు కుడి కాలులో రక్తప్రసారం సరిగా జరగక మొద్దుబారిపోయే సూచనలు కనిపిస్తున్నందున ఆస్ట్రేలియా, న్యూజీలండ్‌లకు పోవలెనని నిర్ణయించుకున్న రాజదంపతుల యాత్ర కాలనిర్ణయం లేకుండా వాయిదా పడినదని బకింగ్‌హాం రాజభవనమునుండి నేటి ఉదయం ప్రకటించబడెను. జార్జిరాజు పూర్తి విశ్రాంతిని తీసుకోవలెనని వైద్యులు నిర్ణయించిరి. అందువలన రాజుగారి ఇతర కార్యక్రమములన్నీ కొన్నినెలలదాకా రద్దుచేయబడినవి.

నేటి ఉదయం రాజభవనంనుంచి వెలువడిన ప్రకటన ఈ క్రిందివిధంగా తెలియజేస్తున్నది: "జార్జిరాజు కుడికాలులో రక్తప్రసారం సరిగా లేకపోవటం కొంత ఆతృతను కలిగిస్తున్నది. ఇతరత్రా ఆయన ఆరోగ్యము, గుండెస్థితి మొదలైనవాటి విషయమై ఆతృత చెందనవసరం లేదు కాని మొత్తంమీద 12 ఏళ్లనుంచీ చేస్తున్న రాజకార్య నిర్వహణం ఆయనను చాల ఆయాసపెట్టినదని వైద్యులు ప్రకటించిరి. ఇటువంటి పరిస్థితులలో దీర్ఘ ప్రయాణాన్ని పెట్టుకుంటే కాలుకు అపాయం ఏర్పడవచ్చును కనుక అది నిలిపివేయబడినది.

కుడికాలు మొద్దుబారిపోయినట్లున్నదని జార్జిరాజు రెండువారముల కిందటనే మొదటిసారి చెప్పెను. అయిదుగురు వైద్యులు వారం రోజులనుండీ ఆయనకు చికిత్స చేస్తున్నారు. వారంతా కలిసి ప్రయాణాన్ని నిలిపివేయవలెనని నిర్ణయించిరి."

రాజుగారి దేహస్థితివిషయమై ఇప్పుడు అంతగా ఆదుర్దా పడవలసినదేమీ, ఆయన రాజభవనంలోనే ఉండి దర్శనమివ్వటం మొదలైన రాజకార్యాలను, నిత్యకృత్యాలనూ నెరవేర్చుతూ ఉండగలరు. ఆయన నేటి రాజభవనములోనే ఉండి కార్యక్రమమును నడిపెను. కాలు కుదుటబడుటకై విశ్రాంతి అవసరం. కనుక ఆయన బకింగ్‌హాం భవనమును విడిచి బయటకు రాడు.

రక్తప్రసారంలో లోపం కలగటానికి కారణం రక్తనాళాలు సరిగా లేకపోవటమే కారణమనీ, మొదట అనుకున్నట్లు రక్తం గడ్డకట్టుకుని రక్తనాళాలకు అడ్డపడటం కాదనీ తెలిసినది. రాజుగారి సొంత వైద్యుడు సర్ జాన్‌వైర్ ఆయనను నేడు పరీక్షించెను.

బ్రిటిష్ పార్లమెంటులోని రెండు సభలు నేడు తమ సానుభూతిని ప్రకటించి త్వరలో కోలుకొనగలరని ఆశించెను. ఆస్ట్రేలియా ప్రధాని ఈ వార్తకై ఎంతో విచారమును ప్రకటిస్తూ నేడు రేడియోలో ప్రకటించెను. ఆస్ట్రేలియా పార్లమెంటు సభ్యులు తమ సానుభూతి సందేశమును గవర్నర్ జనరల్ ద్వారా జార్జిరాజుకు పంపిరి. న్యూజీలాండ్ పార్లమెంటు ప్రతినిధులుకూడా సంతాపమును ప్రకటించిరి.

## ప్రజలు అసంఖ్యాకంగా సైన్యంలో చేరాలి

### పాకిస్తాన్ రక్షణసమస్య: గవర్నర్‌జనరల్ విజ్ఞప్తి

రావల్పిండి, నవంబరు 22: పాకిస్థాన్ రక్షణకే ప్రభుత్వం అన్నిటికన్నా ఎక్కువ ప్రాధాన్యం యిచ్చుచున్నదని, ప్రజలు అసంఖ్యాకంగా ముందుకువచ్చి సాయుధ సైన్యములలో చేరవలెనని, పాకిస్థాన్ గవర్నర్ జనరల్ ఖ్వాజా నజీముద్దీన్ నేడిక్కడ బ్రహ్మాండమైన బహిరంగసభలో ఉపన్యసించెను. పాకిస్థాన్ ఎదుర్కొనుచున్న సమస్యలన్నింటిలోకి ప్రధానమైనది కాశ్మీర్ సమస్యయేనని, యీ సమస్య సంవత్సరంక్రితం ఎలాగున్నదో యిప్పుడు అలాగే ఉన్నదని, నజీముద్దీన్ అనెను.

ప్రపంచశాంతిని మానవక్షేమమును కాంక్షించి, స్వాతంత్ర్యయుతమైన, న్యాయమైన జనవాక్య సేకరణ భారతనాయకులకు అంగీకారయోగ్యం కాగలదని ఆశించుచున్నానని నజీముద్దీన్ తెలిపెను.

అజాద్ కాశ్మీర్ ప్రభుత్వ నాయకుడు గులాం అబ్బాస్ నజీముద్దీన్‌ను నేడుకలుసుకొనెను. ఈయన కాశ్మీర్ యుద్ధరంగము తాజాపరిస్థితిని నివేదించినట్లు తెలియుచున్నది. ఇప్పటికి సంవత్సరంపైగా పూంచ్ [illegible] కట్టుదిట్టములో యిరుకుకొని ఉన్న, భారతసేనను మట్టుపెట్టి సైనికమును ముట్టడించి తప్పించినట్లు అధికారపూర్వకముగా ప్రకటింపబడెను.

కాశ్మీర్‌లో తమ సేనలను క్రమంగా బలపరచుకొనుచుండుట, నవంబర్ మొదటి వారం లగాయితు, వంశపారంపర్యాచార్యులు ప్రారంభించుటవల్ల్టే, కాశ్మీర్ కమీషను నివేదికను భద్రతామండలి పరిశీలించే యీ లోపుగనే, కాశ్మీర్ సమస్యను, సైనిక చర్యలద్వారా తేల్చివేయుటకు, భారత ప్రభుత్వ నిశ్చయమైనట్లు స్పష్టముగా తెలియుచున్నదని, పాకిస్థాన్ [illegible] ఒకడు కరాచీలో నేడు తెలిపెను.

## మద్రాసు ప్రభుత్వ కార్యక్రమాలకు కేంద్ర సహాయం

### ప్రధాని రామస్వామిరెడ్డిగారి విజ్ఞప్తి

చెన్నపట్నం, నవంబరు 23: మద్రాసు ప్రధాని శ్రీ ఓమండూరి పెద రామస్వామిరెడ్డిగారు ఢిల్లీనుంచి నాలుగైదు రోజులైతిరిగివచ్చిన తరవాత నేడు ప్రప్రథమముగా పత్రికా ప్రతినిధులతో సమావేశమైనారు. రాష్ట్ర ఇరిగేషన్ కార్యక్రమాలకు ఇతర అభివృద్ధి కార్యక్రమాలకు కేంద్రప్రభుత్వ సహాయం అవసరమని ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వ మంత్రులతో సమావేశమై విజ్ఞప్తి చేసిరి. ఈ కార్యక్రమాలకగు ఖర్చులో కనీసం సగంఖర్చును కేంద్ర ప్రభుత్వం భరించవలెనని విజ్ఞప్తి చేసినట్లు పత్రికా ప్రతినిధులతో ప్రధాని చెప్పిరి. ఈ క్రింది కార్యక్రమములకగు ఖర్చులను ప్రధాని ఢిల్లీలో కేంద్రప్రభుత్వ మంత్రులకు తెలిపినారు.

తంజావూరులోనూ, చెన్నపట్నంలోనూ పురాతన పత్ర గ్రంథాలయములలోని పత్రికలను ప్రచురించుటకు రు 15 లక్షలు ఖర్చగును. దీని ప్రచురణకు 15 సంవత్సరములు పట్టవచ్చును. చెన్నరాష్ట్రములోని మొత్తం 85000 ప్రాథమిక పాఠశాలల్లోనూ 5000 పాఠశాలలకు మాత్రం స్వంత గృహాలున్నవి. మిగతా 80 వేల పాఠశాలలకూ గృహాలను నిర్మించుటకు రు 16 కోట్లు ఖర్చగును. డెల్టాలులేని మిగతా జిల్లాలన్నిటిలోనూ గల 25000 చెరువులనూ మరమ్మతు చేయించుటకు రు 8 కోట్లు ఖర్చగును. పెన్న, గడిలం, కావేరీతీర ప్రాంతాలలో 'ట్యూబ్‌వెల్స్' స్థాపనకు రు 2½ కోట్లు ఖర్చగును. చిన్న నదులపై ఆనకట్టల మరమ్మతులకు రు 2½ కోట్లు, జమీందారీ ఎస్టేట్లలోని చెరువుల మరమ్మతునకు రు 8 కోట్లు, ఊటబావుల మరమ్మతులకు రు 2½ కోట్లు ఖర్చగును.

## మద్రాసుకు 9,500టన్నుల బర్మా బియ్యము

మద్రాసు, నవంబరు 23: దాదాపు 9,500 టన్నుల బియ్యముతో ఎస్. ఎస్. సిత్వానా అను ఓడ నవంబర్ 22 న మద్రాసు హార్బరు వచ్చెను. ఈ బియ్యములో మద్రాసురాష్ట్రమునకు 7 వేల టన్నులు, మైసూరుప్రభుత్వమునకు 2,500 టన్నులు లభించును. (అ. ప్రె.)

### ధాన్యంబోనసు కూపన్లు

ధాన్యం ఉత్పత్తిదారులు 1947 సం॥ న యిచ్చిన ధాన్యమునకు బోనసు కూపనులు 1948 డిశంబరు 31 లోగా దాఖలుచేసి ఎరువుకై రసీదులుగాని, నగదుగాని తీసుకోవాలని, ఆ తేదీకిమించి గడువొసంగబడదని మద్రాసుప్రభుత్వంవారు వేరొకసారి ప్రకటించిరి.

### వేరుశనగ మిల్లులు

వేరుశనగ మిల్లులలో నష్టంపడుతున్నదని కొందరు మిల్లుయజమానులు తెలిపినందున, వేరుశనగపిట్టు కంట్రోలు, ధరలనిర్ణయం గూర్చి ఆలోచింప డిశంబరు 7 వ తేదీన వ్యవసాయశాఖమంత్రి మాధవమేననుగారు మిల్లుల ప్రతినిధుల సభ యేర్పాటుచేసిరి. ఈ సభయందు వ్యవసాయశాఖ డైరక్టరు, ఆర్థికసలహాదారుకూడ పాల్గొందురు.

### ఉద్యోగుల మార్పు

డా॥ ఎం. అబ్దుల్ హక్ గారు, ప్రెసిడెన్సీకాలేజి ప్రిన్సిపాలుగ నియమింపబడిరి.

ఎల్. జి. నారాయణస్వామిగారు ఇంజనీరింగు కాలేజి (కాకినాడ) ఇన్‌స్పెక్టరుగ నియమింపబడిరి. డా॥ యు. శంకరనారాయణగారు, అనంతపురంకి, డా॥ బి. పట్టాభిరామిరెడ్డిగారు బళ్ళారికి, డా॥ సి. రామచంద్రరావుగారు గుంటూరికి మునిసిపల్ హెల్తాఫీసరులుగను, డా॥ కె. గోఖలేగారు, గుంటూరుజిల్లా హెల్తాఫీసరుగను మార్చబడిరి.

జి. కుప్పుస్వామి నాయుడుగారు, బరువు పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటుగా నియమింపబడిరి.

## జర్మనీకి తపాలా రవాణా

మద్రాసు, నవంబరు 18: జర్మనీకి తపాలా సౌకర్యములు యింకను పెంపొందించియున్నారు. ఇప్పుడు జర్మనీకి అన్ని వైపుల యీయబడిన ఉత్తరములు, పుస్తకములు పంపవచ్చును. బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి ప్రాంతములకు 15 ఎల్. బి. పౌనులకు మించని పార్శిలు బంగీలు పంపవచ్చును. సోవియట్ ప్రాంతమునకు ఉత్తరములైన యెడల 1 పౌను, పుస్తకములయినయెడల 11 పౌనుల బరువునకు మించకుండా పంపవచ్చును. జర్మనీయందలి బ్రిటిష్ అమెరికన్ ప్రాంతములకు, బెర్లినందలి బ్రిటిషు ప్రాంతమునకు ముద్రితములకు కానికలను యిప్పుడు రిజిష్టరుచేసి పంపవచ్చును.

## జమీందారీబిల్లు

### కౌన్సిలులో క్లాజువారీ చర్చ

చెన్నపట్టణం, నవంబరు 24: మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో నేడుదయం ప్రశ్నల కాలానంతరం జమీందారీ రద్దు బిల్లుపై క్లాజువారీ చర్చ కొనసాగింది. నేడు బుధవారం అనధికార కార్యక్రమం ప్రతిపాదించవలసినదే కాని నేడు కూడా ప్రభుత్వ కార్యక్రమం నిర్వహించవలెనని డా॥ రాజన్‌గారు ప్రతిపాదించిరి. ఈ తీర్మానమునకు సభ అంగీకరించినది. జమీందారీ బిల్లు పూర్తి కాగానే అనధికార కార్యక్రమానికి ఒకదినం ఇవ్వవలెనని ప్రతికూలపక్ష నాయకులు డా॥ జాన్ గారు కోరినారు. సభ 27 వ తేదీతో వాయిదా వేయవలసియున్నందున ఇది సాధ్యపడదని డా॥ రాజన్‌గారు చెప్పిరి. కాశీశ్వరరావుగారి బహుపత్నీక నిషేధ శాసనమును శుక్రవారంనాడు ప్రతిపాదించు అవకాశమిచ్చుటకు డాక్టరు రాజన్‌గారు అంగీకరించిరి.

ఎస్టేటు భూములపై రైత్వారీపట్టాలను మధ్య దళారీలకు గాక అసలు కర్షకునికి ఇవ్వవలెనని సూచించుచూ డా॥ జాన్‌గారు 11, 12, 13, 14 క్లాజులను తొలగించి కొత్త క్లాజును చేర్చవలెనని ఒక సవరణను ప్రతిపాదించిరి, మధ్యవర్తులన్నందరిని తొలగించి స్వయంగా కృషి చేయుచున్న వారికే భూమిపై హక్కుండవలెనని కాంగ్రెసు ఎన్నికల నివేదికలో ప్రకటించబడిన ఆశయము సిద్ధించుటకే ఈ సవరణను ప్రతిపాదించుచున్నట్లు డా॥ జాన్‌గారు చెప్పిరి.

ఈ ఒక్క సవరణ నంగీకరించినచో రెవిన్యూమంత్రిగారు వేరే ప్రత్యేకశాసనం ముమ్మందు తేవలసిన అగత్యం ఉండదనిరి. శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారు సవరణను బలపరచుచూ, వాస్తవంగా భూమిని దున్నేవానికే రైత్వారీ పట్టానిచ్చినప్పుడే ఆహారోత్పత్తి వృద్ధికాగలదని చెప్పిరి.

ఇట్లు రైత్వారీ పట్టాలను, భూమిపై యాజమాన్యపు హక్కునుపొందు కర్షకుడే ఎస్టేటు ప్రొప్రైటరుకు పరిహారమును చెల్లించవలెనని చెప్పిరి. ఏళ్లనుండు రద్దుచేయబోవు మధ్యవర్తి వర్గాన్ని ఇప్పుడు సృష్టించినందున, రెండు పర్యాయములు ప్రభుత్వం పరిహారమును చెల్లించవలసి యుండుననిరి. రెవిన్యూమంత్రి వెంకట్రావుగారు సమాధాన మిచ్చుచూ, రైత్వారీ విధానంలోని పట్టాదార్లను పట్టాపద్ధతులను రద్దుపరచుట ప్రభుత్వోద్దేశం కాదని చెప్పిరి. కాంగ్రెస్ ఎన్నికల నివేదికలో ఇట్టి వాగ్దాన మివ్వబడియుండలేదనిరి. అదిగాక ఈ సవరణవలన సవరణ ప్రతిపాదకుల ఆశయం నెరవేరజాలదనిరి. ఆధునిక వ్యవసాయ విధానాల దృష్ట్యా పట్టాదార్లను తొలగించుటవలన ఆహారోత్పత్తి వృద్ధి కాజాలదనిరి. సవరణను వోటుకుపెట్టగా వీగిపోయినది.

లంకభూములకు మిగతా భూములకు వ్యత్యాసము చూపవవసరంలేదనీ, రైతుకు పట్టా ఇవ్వవలసిన భూమి రయితీభూమి మాత్రమే కావవసరంలేదనీ శ్రీ బి. వి. నారాయణస్వామినాయుడుగారు సూచించుచూ 11 వ క్లాజు (ఏ) సబ్‌క్లాజులో ఒక సవరణను ప్రవేశపెట్టుచూ, (బి) సబ్‌క్లాజును తొలగించవలెనని ప్రతిపాదించిరి. న్యాయంగా రైతు సాగులో ఉన్న లంకభూములను, 1939 నుంచి అతని అధీనంలో లేనంత మాత్రాన, వానిపై పట్టాను రైతుకు ఇవ్వకుండుట చాల అన్యాయమని నాయుడుగారు చెప్పిరి. ప్రకాశం కమిటీ లంకభూములను గురించి పరిశీలించలేదు. అట్టి భూములపై ఇట్టి నిర్ణయములు చేసినచో అనేకులకు అన్యాయము జరుగుననిరి. ఈరీతిగా రైతులకు పట్టాలివ్వని భూములలో, ఎస్టేటు ప్రొప్రైటరుకు హక్కులేని వానిని ప్రభుత్వం అధీనం చేసుకొనవలెనని సూచించు 11 (బి) సబ్ క్లాజును తొలగించవలెనని నాయుడుగారు చెప్పిరి. అత్యంత విలువైన ఈ లంక భూములను తమపార్టీ అనుచరులకు, రాజకీయ బాధితుల పేరుతో వారికి కట్టబెట్టుటకు ప్రభుత్వం యత్నించుచున్నదనిరి. ఎన్నికల్లో ప్రచారంచేయుటం మాత్రమే చేసిన రాజకీయ బాధితులకు భూమివ్వటం ఏమో తెలియనివారికి భూములిచ్చుటకు ప్రభుత్వం ఈ పన్నాగం పన్నిందనిరి. ఇంతలో శ్రీ వెంకట్రావుగారు రాజకీయ బాధితుల పట్ల దూషణను నిరసించిరి.

[అధ్యక్షులు: "ఈ బాధితులు ఇంకా బాధపడుచునే ఉన్నారు కాబట్టి"] జమీందారు తన ఇష్టులకు లంక భూముల నిచ్చుచుండగా, ప్రభుత్వం వారినుండి ఆ భూములను లాగుకొని ప్రభుత్వం తమ అనుచరులకు ఇవ్వదలచుచున్నదని నాయుడుగారు చెప్పిరి.

ఒక శాసనసభ్యురాలికి ప్రభుత్వం 12 ఎకరాల లంకభూమిని దానంచేసిందనీ, ఆమె ఈ అవకాశం తీసుకొని ఆక్రమంగా ఆక్రమించుకోవాలని చూచుచున్నదనీ నాయుడుగారు చెప్పిరి. ఈ రీతిగానే పార్టీ అనుచరులకు కట్టబెట్టుట న్యాయ విరుద్ధమని చెప్పిరి.

డా॥ జాన్‌గారు సవరణలను బలపర్చిరి, మంత్రి వెంకట్రావుగారు సమాధానమిచ్చుచూ, ప్రకాశం కమిటీ నివేదిక బహిరంగం కాగానే జమీందార్లు లంక భూములపై తమ ఇష్టులపేర పట్టాల నిచ్చినారనీ, వారు వాస్తవంగా పట్టాల కర్హులు గారనీ చెప్పిరి. ఇట్టి పరిస్థితిలో ఇట్టిక్లాజు అవసరమని మంత్రిగారు చెప్పిరి. తాము లంక ప్రాంతంలో పుట్టినవారనీ, లంక భూముల విషయం సమగ్రంగా తమకు తెలుసుననీ మంత్రిగారు చెప్పిరి. సవరణ వీగిపోయింది. తరువాత 11 వ క్లాజు ఆమోదించబడింది. 12, 13, 14, 15 క్లాజులు ఎట్టి సవరణ ప్రతిపాదింపబడకుండానే ఆమోదించబడినవి.

పట్టాలు పొందువారు అసెస్‌మెంటులు ప్రకటింపబడిన తేదీ మొదలు ప్రభుత్వానికి చెల్లించవలెననీ, బకాయీలు కాక ఇతరత్ర రైతు యజమానికి ఏమైన చెల్లించవలసి యున్నచో, అదేరీతిగా ప్రభుత్వానికి చెల్లించుచునే యుండవలెననీ 16 వ క్లాజు సూచించుచున్నది. శిస్తు తగ్గింపు బిల్లుప్రకారం శిస్తులు తగ్గింపబడినప్పటికీ, ప్రభుత్వానికి చెల్లించవలసినప్పుడు, రైతు పూర్వపురేట్ల ప్రకారమే నీటిసుంకములు మొదలగువానిని చెల్లించవలెననుట అన్యాయమని నాయుడుగారు చెప్పుచూ, ఏ రేటు తక్కువగా ఉండునో ఆ రేటుప్రకారమే చెల్లించవలెనని సూచించుచూ నాయుడుగారొక సవరణను ప్రతిపాదించిరి. స్థానిక పరిస్థితులను బట్టి, నీటివనరు మొదలగువానిని బట్టి ఈ సుంకములు విధించుచూ, అది అన్యాయం కాజాలదని రెవిన్యూమంత్రిగారు చెప్పిరి. సవరణ వీగిపోయింది. 16 వ క్లాజు ఆమోదించబడినది. 17 వ క్లాజుపై ఎట్టి చర్చ లేకుండ ఆమోదించబడింది.

### ఎస్టేట్లలోని గృహాలు

ప్రభుత్వాధీనం కాగల ఎస్టేట్లలోని గృహాలకు సంబంధించిన 18 వ క్లాజులోని 7 సబ్ క్లాజులను పూర్తిగా తొలగించి, దానిస్థానే, రైత్వారీపట్టాను పొందువారు ఎస్టేటు కార్యాలయాలు గల గృహాలను స్వాధీనపర్చుకొని పూర్తిపరిహారమును యజమానికి చెల్లించవలెనను కొత్త క్లాజు చేర్చవలెనని సూచించుచూ డా॥ జాన్‌గారు సవరణ ప్రతిపాదించిరి.

ప్రభుత్వాధీనం కాగల గృహాలు బహుకొద్దిగా నున్నవనీ, ఇందులో అన్యాయమేమీ లేదని రెవిన్యూమంత్రిగారు సమాధానమిచ్చిరి. సవరణ వీగి పోయింది. 18 క్లాజు ఆమోదింపబడినది. 19 క్లాజుకూడా ఆమోదింపబడింది. 20 క్లాజు గనులు, ఆవులు మొదలైన వానికి సంబంధించినది. యీ క్లాజు లోపభూయిష్టంగా ఉన్నదని బి. వి. నారాయణస్వామినాయుడుగారు చెప్పిరి. ప్రభుత్వం గనులనిర్వహణాలు నిలిపివేయగల హక్కును కూడా తీసుకొనుట అనవసరమే కాక అన్యాయమని చెప్పిరి. వీనికి పరిహార మెట్లివ్వగలరో ఈ క్లాజులో సూచించబడనందున ఈ నియమం న్యాయవిరుద్ధమైనదని చెప్పిరి. రెవిన్యూ మంత్రిగారు సమాధానమిచ్చుచూ, ఈ విషయమై న్యాయశాస్త్ర నిపుణుల సలహాను తీసుకొన్నారనీ, నీహారు శాసనంలో విషయాలను పోల్చిచూచినారనీ, ఇందులో అన్యాయంగాని, న్యాయశాస్త్ర విరుద్ధమైనదిగాని ఏమీలేదని నిపుణులు చెప్పినారనీ చెప్పిరి. 20 వ క్లాజుకు నారాయణస్వామి నాయుడుగారు ప్రతిపాదించిన వేరు సవరణ అనవసరమనీ, సర్వే, రీసర్వే ఖర్చులన్నీ ప్రభుత్వమే భరించగలదనీ రెవిన్యూమంత్రిగారు చెప్పినందున నాయుడుగారు సవరణను ప్రతిపాదించలేదు. 22, 23 క్లాజులు చర్చ లేకుండా ఆమోదింపబడినవి.

### పరిహారం

పరిహారమునకు సంబంధించిన క్లాజులు 24 మొదలు 54 వరకూ అన్నిటినీ తొలగించి, ఎస్టేటు ప్రొప్రైటర్లకు భూములపై మార్కెట్ ధరపై నూటికి 15 వంతులు అధికంగా పరిహారం చెల్లించవలెననీ, ఆ భూములపై పట్టాలను పొందువారే ఆ పరిహారమును చెల్లించవలెననీ డా॥ జాన్‌గారు సవరణను ప్రతిపాదించిరి. రెవిన్యూమంత్రిగారు ఈ సవరణను అంగీకరించజాలమనిరి. సవరణలు నిరాకరింపబడినవి. 24, 25 క్లాజులు సభచే ఆమోదించబడిన అనంతరం అల్పాహారమునకు విరమించినది.

## బస్సురేట్ల హెచ్చింపుపై కౌన్సిల్‌లో విరామ తీర్మానం

చెన్నపట్నం, నవంబరు 24: చెన్నపట్నంలో బస్సురేట్ల హెచ్చింపు గురించి అబ్దుల్ లతీఫ్ ఫరూకీగారు ప్రతిపాదించిన విరామ తీర్మానము నేడు సాయంకాలం 4 గంటలకు చర్చింపబడునని అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారు ప్రశ్నల కాలానంతరం ప్రకటించిరి.

## మేయర్ అధికారం అధికంచేసే యత్నం

చెన్నపట్నం, నవంబరు 24: చెన్నపట్నం కార్పొరేషన్ మేయర్ పదవి అధికారములను అధికంచేయుటకు, పదవీకాలం పెంచుటకు చట్టంలో అవసరమయిన సవరణ విషయమై పరిశీలించుటకు ప్రభుత్వం ఒక సంఘమును నియమించెను.

## పశ్చిమ యూరప్ కూటమి ప్రథమ సమావేశం

### మాంట్‌గొమెరీతో చర్చలు

పారిస్, నవంబర్ 24: కిందటి మాసమున సృష్టింపబడిన 'పశ్చిమ యూరపు కూటమి' ప్రథమ సమావేశమునందు పాల్గొనుటకు, సేనిచ్చుటకు రానున్నారు. ఈలోపున, తమ యిరుగు పొరుగు దేశములతో సన్నిహితత్వ మేర్పరచుటకు ఫ్రెంచి మంత్రులు కొన్ని ప్రాథమిక చర్చలుజరుపుచున్నారు. యుద్ధశాఖామంత్రి, పాల్, రమాడియర్ గారు, పశ్చిమ యూరప్ కూటమి రక్షణ సంఘాధ్యక్షులు మార్షల్ మాంట్‌గోమరీగారితో ఒకగంట సంభాషించిరి.

ఫ్రెంచి ప్రధాని హెన్రీ క్యూయిలీ, ఇటాలియన్ ప్రధాని సెనార్ ఆల్‌సైడ్ గాస్పరీగారిని తమ గృహమున కాహ్వానించిరి.

ఫ్రెంచిప్రధానితో సంభాషణలు ముగిసిన తరువాత, గాస్పరీగారు ఫ్రాంసు, ఇటలీలకు అన్ని రంగములలోనూ పరిపూర్ణ సహకార మేర్పరచుటకు అవకాశములు గలవని ఒక విలేఖరితో ననిరి.

ఈ సమావేశానంతరము ఫ్రెంచిప్రధాని మాంట్‌గోమరీతోనూ, ఇటలీ ప్రధాని ఫ్రెంచి విదేశాంగమంత్రి ఎం. షూమన్ గారితోనూ కలసి సంభాషించిరి.

రేపు జరుగవలసిన పశ్చిమ యూరప్ కూటమి సమావేశము శుక్రవారమువరకునూ వాయిదా వేయబడినది.

లంకాస్టర్ సంస్థాన వైస్‌చాన్సెలర్ యం. హగ్ ఆల్‌టన్‌గారు విమానములో పారిస్‌కు వచ్చిరి.

## చైనా సేనల ఆందోళనస్థితి

(1-వ పేజి తరువాయి)

కరిస్తున్నారని టింట్సిన్‌లోని రాయిటర్ విలేఖరి తెలుపుచున్నాడు.

### ప్రభుత్వాందోళన

నాన్కింగు, నవంబరు 23: సూచౌవద్ద జరుగుచున్న యుద్ధమునుగురించి నగర రాష్ట్ర ప్రభుత్వ ప్రకటనలలో గెలుపు వార్తలు లేనందున అధికారులు ఆందోళితులగుచున్నారని తెలియుచున్నది.

### వాషింగ్టను సూచన

వాషింగ్టను, నవంబరు 23: చైనాకు ఒక పెద్ద సైనిక రాయబారమును పంపి, కమ్యూనిస్టుల నెట్లు నిరోధించవలెనో చైనా ప్రభుత్వ సైనికులకు నేర్పించవలెనని వాషింగ్టనులో ఒక సూచన చేయబడెనట.

### ప్రభుత్వ సేనలకు విజయం

నాన్కింగ్, నవంబర్ 23: ఉత్తరం గానూ, వాయవ్యం గానూ పురోగమిస్తున్న, చైనా ప్రభుత్వ సైన్యాలు నేడు సూచౌకు 50 మైళ్లు దక్షిణంగా ఉన్న సుయిచీస్‌లో ఉన్న కమూనిస్టుబలాలను నిర్మూలించి ఆపట్టణాన్ని, వశపరచుకొన్నవని చైనా సైనిక వార్తాసంస్థ తెలుపుతున్నది. కిందటి వారంవరకూ కమ్యూనిస్టులు నగరంలో సగభాగాన్ని ఆక్రమించుకొని ఉన్నారనీ నేడు ప్రభుత్వసైన్యాలు వారిని నిర్మూలించినవనీ ఆ వార్తాసంస్థ తెలిపుచున్నది.

### అమెరికా ఆలోచన

వాషింగ్టన్, నవంబరు 24: అమెరికా జాతీయ రక్షణసంఘం నేడిచ్చట సమావేశమై చైనా పరిస్థితులను చర్చించినది. ఈ విషయమై ఈ సంఘమొక నిర్ణయమునకు వచ్చినట్లు తెలుస్తున్నది.

### విదేశీయుల ఖాళీ

ఉత్తర చైనాలోని టీనిట్సిన్‌లో దిగబడిఉన్న 100 మంది విదేశీయులను తీసుకొనివచ్చుటకై బ్రిటిష్ నౌక 'లింగ్‌వాంగ్' నేడు హాంకాంగ్‌నుండి బయలుదేరెను. ఈ ఓడ షాంఘయ్ నగరానికి 10 వేల టన్నుల బియ్యమునుకూడా తీసుకొనివెళ్లెను. బ్రిటిష్ క్రూయిజర్ 'సస్సెక్స్'కూడా నేడు హాంకాంగ్ నుండి షాంఘయ్‌కి బయలుదేరినది.

## ఆగ్నేయాసియాకు ప్రమాదకరమని "టైమ్సు" హెచ్చరిక

లండను, నవంబరు 22: ఆగ్నేయాసియా అంతటా విజృంభించెడి కమ్యూనిస్టు విప్లవములనుచూచి సుణపాయములను నేర్చుకొనుటకు, తీసుకోవలసిన నిర్మాణాత్మక చర్యలనుగూర్చి ఆలోచించుటకు బ్రిటిష్, ఫ్రెంచి, డచ్చిప్రతినిధులు ఒకచోటసమావేశం కావలెనని లండన్ టైమ్సుపత్రిక నేటి సంపాదకీయం వ్రాసినది.

చైనాలో కమ్యూనిస్టులు కొమింటాంగుల తాకిడి ఆగ్నేయాసియా కంతటికీ తగులుచున్నదనీ, ఆగ్నేయాసియాలోని కమ్యూనిస్టులు క్రమంగా వ్యాపించుచున్నారు. ఇంగా సమయంలో చైనా కమ్యూనిస్టు విజయములు వారికి అధిక ధైర్యమును పురిగొల్పే ప్రమాదము రాకుండా చేయవలెననికూడ టైమ్సుపత్రిక హెచ్చరించెను.

